# : కృతి :

ప్రాభవమొందినదాది గౌరవము మీఱఁ
బెంచి, కవితను నాకునేర్పిన పవిత్ర
కన్నయాచార్య గురుపాద కంజములకు
నంకిత మొనర్తు నీపొత్త మమితభక్తి.

లోకములోన నే పురములోనను లేని వినూత్నవృత్తిఁ దా
వైకొని, యెట్టివారలు దగా పడకుండ సువర్ణ భూషలన్
మాకమునైచి, వన్నెనుగనుంగొని, మూల్యము నిర్ణయించి "యు
ల్లాకు"ను వ్రాసి యిచ్చు యకలంక చరిత్రునకిత్తు నీ కృతిన్.

కృష్ణప్రీతి జ్ఞాది కృతు లనేకము వ్రాసి
వాసిఁ గాంచిన లసత్ పండితుండు;
నవరత్నముల సుగుణముల దుర్గుణముల
శోధించిచెప్పు, మేధాధనుండు;
జాతక ఫలము లాశ్చర్యమందగఁ దెల్పు
జ్యోతిషశాస్త్ర విఖ్యాత పురుషుఁ;
డున్నతాంచిత మహోద్యోగులచే, యోగ్య
తా పత్రములఁగొన్న ధన్యమూర్తి;
ఊరు సుపర్ణసమాని గోత్రోద్భవుండు;
సరస సున్నపు కన్నయాచార్యవరుఁడు;
నా పితామహుఁ డీ కృతినాథుఁ డగుట
కంటె భాగ్యంబు వేఱొండు కలదె నాకు?

రచయిత.

# అభిప్రాయము

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ కవిసార్వభౌమాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొసంగిన యభిప్రాయము :—

ఇది శ్రీ వేంకట వీరరాజకవులలో నొకరగు బ్రహ్మశ్రీ సున్నం వీరరాజకవి గారిచే రచింపఁబడినది. కాళిదాస ప్రణీత మేఘసందేశ గ్రంథభాగ శేషాంశముల సేకరించి యీ గ్రంథము రచింపఁబడినది ప్రధానముగ జనులకు "నాతి గల బ్రహ్మచర్యము" ప్రధానమైన కథ్యము. దానిని బురస్కరించుకొని కరుణారసముతో నిది విరాజిల్లుచున్నది. నేను గ్రంథమంతయు సావధానముగా నాకర్ణించితిని. వీరరాజుగారి కవిత్వము నాతి కఠిన మృదుమధురమై మనోహరమై యుండును శైలి గంగాప్రవాహమువలె ధారాశుద్ధి గలిగియుండును. ఇది పాఠశాలలలోఁ బాఠ్యగ్రంథముగా నుండుటకును దగి యున్నది.

రాజమండ్రి,
20-7-46.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# ప్రోద్ఘాతము

యక్షుఁడు కుబేరుని కొలువులో నొక సేవకుఁడు. విశ్వాసపాత్రుఁడగు సేవకుఁడగుటచే యక్షునియెడఁ గుబేరునకుఁ దయఁ గలిగి చక్కని సుకన్య నొకతెను వెదకి వానికి వివాహము గావించెను. సమాన రూపలావణ్యములుగల యా నవదంపతులు ఆనంద రసాబ్ధి వీచికలలో విహరించుచుండిరి.

ఒకనాఁడు భార్య యలుకగొనగా నాపె యలుకనుదీర్చి యక్షుఁడు కొలువుకూటమున కేగుట యొక్క యరగడియ యాలస్యమగుటయు సంభవించెను. దానఁ గుబేరుఁడు "ఇంత కామాంధకారుఁడవైతివా" యని యక్షునిపై మండిపడుచు, "నీ భార్యను విడనాడి యేకాకివై భూలోకములోఁ జిత్రకూటపర్వతము చెంత నొక సంవత్సరము వసించెదవుగాక! నీ యమరత్వము నశించుగాక!" యని వానిని శపించెను. అంత గాఢముగాఁ బ్రేమించినటువంటి పత్నీవియోగము జెందిన యక్షుని హృదయావేదనయే యిందలి కథాంశము.

శ్రీ కాళిదాస మహాకవి "మేఘసందేశము"లో, నెనిమిది మాసములు గడచిన పిదప వర్షర్తు వాసన్నమగుటచేఁ బొడమిన మేఘునిఁ గాంచి :—

చ। కుశలమె నీకు మేఘ! యెటకుంజనివచ్చితివో? రాగదే భవా
దృశుల పవిత్రిదర్శనము దేమున కబ్బుట యబ్బురంబు, దు
ర్దశను క్షశించి కృంగితిని తాపకకీలలవారి చేత నా
కుశమనమున్ గనంత చెలువ చూర్పుమకొల్పెదగొండమల్లెలన్

ఉ॥ చల్లనివాడవంచు విలసస్మితహాసియుగుణాకరుండ వం
చెల్లరు నిన్ను గూర్చి నుతియించు కాళిదాస ద్వితీయ పాద పం
ఫుల్లసరోజముల్ గనయపూర్వక భక్తిని నాశ్రయింతు, నా
పల్లవపాణి చెంగటకుఁ బంపెద నేగుము, రామబాణమై.

యని యర్థించుచు వానిచే సహృదయమొక్కరికి సందేశ మంపించెను.

ఈ యెనిమిదిమాసములోగా శ్రీ కాళిదాసమహాకవి వైగ్రంథమున—

తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తస్సకామీ
నీత్వామాసాన్ కనకవలయభ్రంశరిక్త ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్ట సానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ.

అను శ్లోకమును వ్రాసి, భార్యావియోగ దుఃఖమున యక్షుఁడెంతగా చిక్కి శల్యావశిష్టుఁడైనాఁడో మనమూహించుకొనుట కవకాశము గలిగించెను. ఆ యవకాశమును బురస్కరించుకొనియే, యక్షుఁ డీయెనిమిదమాసములలోగా నెంత బాధపడినాఁడో యూహించుచు నా స్వంతభావములతో నే నీ చిఱుకావ్యమును రచించితిని. నాప్రయత్న మెంతవఱకు ఫలించినదో నిర్ణయించుభారము కవిలోకముపై నున్నది.

మదరాసులోనున్న శ్రీ తెలుఁగుభాషాసమితి కార్యదర్శిగారికి 31-8-48 నాఁటికిఁ గవులు తమకావ్యములను బంపింపవలసియుండుటచే హడావుడిగా నే నీపొత్తమును రెండు దినములలోనే యచ్చొత్తింపవలసి వచ్చుటవలన యచ్చుటచ్చుటఁ గొన్నితప్పు లుండియుండవచ్చును. వానిని సవరించుకొని చదువ సహృదయులఁ బ్రార్థింతును.

ఈ "యక్షప్రవాసము"ను సావధానముగా నాకర్ణించి తమ సదభిప్రాయము నొసంగిన కవిసార్వభౌములు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి నాహృదయపూర్వకాభివందనములు.

ఈపొత్తమును వెంటనే యచ్చొత్తించుకొనుట కవకాశముగా దమకు దామై ధనసహాయముజేసి నన్నుఁ బ్రోత్సహించిన నాప్రియమిత్రులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

తుని,
30-8-1948.

సున్నం వీరరాజకవి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ప్రార్థన

శ్రీ రంజిల్లెను కొండమల్లిక పురిం బ్రహ్మాపురంబై వెల్గి, సం
సారాంభోధి దరించి భక్తులకు బ్రహ్మజ్ఞశక్తిం జూపించి, ధా
త్రి రాజగువాక జీవిత సమాధింగొన్న శ్రీ పోతులూ
రీవీర బ్రహ్మగారున్ భజించెద, మనోభీష్టంబు సిద్ధింపగన్.

వెన్నెల వూచితా యునికి ప్రేమ జనించి మగండు ప్రక్కలో
నున్న యుమాసతిన్ గవయు నూహ జనించునటన్న యీర్ష్యచే
వన్నె దొలంగి జాహ్నవి ప్రవాహముగా దిగజారి యన్నెలన్
గ్రన్నన గప్పివైచెం, జలు సన్న్యాయంగను శంభుం గొల్చెదన్.

ఆనందంబున శేషపాన్పుపయి భార్యంగూడి సల్లాప సం
ద్రానం దేలుచునుండ శ్రీశుఁడు, తరంగాల్ పొంగి తత్ శేషునా
రా నెట్టంగ బిరాన నొండొరులు గాఢాశ్లేషణల్ గొన్న ఆ
లక్ష్మీనారాయణులన్ స్మరింతుశుభముల్ చేకూర నశ్రాంతమున్.

వాణిన్, నవనీలాంబుద
వేణిన్, గమనీయ విమల విశ్రుత సుగుణ
శ్రేణిన్, విధి రాణిన్, మృదు
పాణిన్, మదిఁగొలుతు సరస వాఙ్నిపుణతకై.



ఓమ్

# యక్ష ప్రవాసము



నరలోకంబున గానవాంతరములోనన్ జిత్రకూటాద్రి క
వ్వారసామీప్యమునం దాకేండు నమస్కృత్వంబెల్లం బోనాడి రేయిం
టరిగాం గుందుమటంచు శాపమొసంగెన్ గట్టా! కుబేరుండు, నా
తరమా ఘోరవియోగసాగరము నీదన్ నిస్సహాయుండనై! ౧

భూలోకంబునం బావనంబగు స్థలంబుల్ నేత్రపర్వంబుగా
నాలోకించుచు శాపమున్ గడప సాధ్యంబైన నిశ్చింతగాం
గాలక్షేపము సేయంగల్గుదు, నటుల్ గాకుండ నుగ్రాటవిన్
గూలం ద్రోసెం గుబేరుం డచ్చోటనె నే గొంతెత్తి రోదింపంగన్.

అలుకను బూనియున్న ప్రియురాలినిం గాంచుటె నాకునెంత మో
దులు కగుటన్ సరాగమున కోమలి కోపము దీర్పగల్గి నేం
గొలువున కేంగనింత యొనంగూడెను; తామసమాడు దానికిన్
గలుగగరాదు; కల్గునెడ కష్టపరంపర మూకి తీరెడిన్. 3

వలదు వివాహమన్న బలవంతముగా ధనదుండు పెండిలిన్
జలిపి, రవంత కొల్వునకు జాలముగాం జన శాపమిచ్చె మా
వలపుం దలంపంబోక, ధనవంతుని కత్తికి రెండువైపులన్
గలుగును వాడియన్న నుడికారము సార్థకమయ్యె నియ్యెడన్,

నా యనువారు లేక విపినంబున నెక్కటినై వసింపగాఁ
జేయుట కా కుబేరునకుఁ జెల్లెను గాక! ధనేశుఁ డాలచే;
న్యాయము నెంతు రే ధనమదాంధులు లోకములోన నన్నిటన్
హేయము దాస్యవృత్తి వహియించుట యెంతటివానికేనియున్.

చలమున ధర్మాధర్మం
బులు తలఁపక ధనదుఁ డింత ముప్పు ఘటించెన్
దల యమ్ముకొన్న వానికి
ఫలితం బింతకును మించి ప్రాప్తించునొకో! ౬

ఒకనాఁడేని నలక్ష్యభావమున నాజ్ఞోల్లఘనం బే నొన
ర్పక యున్నాళులు భక్తిశ్రద్ధలను సేవల్ సేసితం చూహాన్సే
యక పౌలస్త్యుఁడు నన్ శపించె నిసుమంతాలస్యమైనందుకే,
యకటా! పూర్ణకృతఘ్నమానసులు కారా, యీధనాధీశ్వరుల్?

మంచిగఁ దీపి మాటలను మాటికిఁ బల్కుచు వేళమించి చే
యించెను సేవలా ధనదుఁ డెన్నియొ సారులు, నొక్కనాఁడు నే
నించుక జాలముం జలుప నిట్లు శపించె, నొకళ్ళ దోస మెం
ెంచెడు వాఁడు సొంతదొసగెంచఁడు కొంచె మదేమిచిత్రమో!

"అపచారంబు క్షమింపఁ గావలె, కుబేరా! యింక నేనన్నఁ డి
ట్లపరాధం బొనరింపఁబోను, కరుణాయత్తైక చిత్తుండవై
యిపుడీనేరము సైఁప గావలయుఁ దండ్రీ!" యంచుఁ బ్రార్థించినన్
గృపరాదయ్యె నదేమి మానసమొ; లే కేదే శిలాఖండమో!న

ఇనుముఁ బాషాణమును వజ్రమును సమాన
రీతిఁ గరుగఁగాఁ బోసి కంజాతభవుఁడు
తన మది సృజించెఁ గాఁబోలు, ధనదుఁ బోలు
కఠిన చిత్తుని నేను జగానఁ గాన. ౧౦

కనుగప్పి తన ధనాగారములో నున్న
మించుభూషలు దొంగిలించు టెఱుఁగ,
గలసైన నన్యకాంతల బల్మిఁ జెఱఁబట్టి
మానభంగము సేయఁ బూను టెఱుఁగ,
జెప్పిన పనియెల్లఁ జేసి తీరుటె కాని
వాని మాటకు మారు పలుకు టెఱుఁగ,
ననుదినంబును గొల్వ నరుగుటయే కాని
యొక పూటయిన మాని యుండు టెఱుఁగ,
నరగడియ జాల మొనరించి నంతమాత్ర
మునకె నాకిట్టి ఘోరదండన విధించె,
నిట్టి విపరీత ప్రభువుల నింత దనుక
కని విని యెఱుంగ నేఁ ద్రిలోకములలోన. ౧౧

అరగడియ జాగు సేయఁ బె
క్కరగడియల శిక్షఁజెప్పె నకటా! యెటు మ
త్తరుణీ వియోగభరమును
భరియింప న్గలనో హృదయ భారము మీఱన్. ౧౨

తలనొప్పి వచ్చినట్టులు సుంత తెలిపిన
ధన్వంతరినిఁ ద్వరితముగఁ బిల్చుఁ;
దనువున నస్వస్థతగ నున్న దన్న దాఁ
బదము లొత్తును కరపల్లవములఁ;
నాఁకలి యగుచున్నదన్న వెంటనె రుచ్య
భక్ష్యంబులను దానె వండిపెట్టు;
స్నాన మాడెద నన్న సంపెఁగ నూనెతోఁ
దలయంటి పన్నీట జలక మార్చు;
నేను చెప్పకె తడవుగా నెన్నియైనఁ
దెలిసి తీర్చును క్షణమైన జాగులేక;
యట్టి యిల్లాలి నెడఁబాసి యెట్టులేను
మనఁగలాఁడను శాప సమాప్తివఱకు ? ౧౩

కాననసీమనో వనతి యగాధ పయోనిధినో తలంచు మా
త్రాననె కామవిభ్రమము తగ్గుటంచు వచింతురు కాని, న
న్నానల పాలొనర్చినను గామవికారము తగ్గఁబోదు, మ
న్మానసరాజ్యలక్ష్మి వదనంబు కనుంగవఁ గట్టియుంటచేన్ ౧౪

ఎన్నఁడుఁ గన్నుఁ దమ్ముల వహించి యెఱుంగను దుఃఖబాష్పముల్
మున్నటిదాఁక నించితిఁ బ్రమోదరసాశ్రులె కాని, శాపమున్
గన్న క్షణంబు నుండియు ననారత నిస్తుల శోకవారి నా
కన్నులఁ గార్చుచుంటిఁ జుమి కంటికి మంటికి నేకధారగా. ౧౫

వటి కొకప్పుడైన భువి నెంతట యుండునుగాని, నాకు క
న్నీటి కొకించు కంతయున నిక్కముగా మఱి యొదుటన్న దే
నాఁటికి లేదు, జాహ్నవి యనారతముం బరమేశు శ్రీ జటా
జూటమునుండి పైకుబుకుచొప్పున నశ్రులు పొంగి పార్లెడిన్.

“అలుకను దీర్చ నింత శ్రమ నందఁగనేటికి? లెండు వేళకున్
గొలువున కేఁగకున్న యెడఁ గోపము జెందుఁ గుబేరుఁ”డంచు రా
గలగతి జోస్యముం దెలుపు నైవడి భార్య వచింపఁగాని, యు
ప్పులుకు రుచింపనౌనె? యిటువంటి యవస్థనుఁ బొందనుండగా.

“నమ్మినబాటు నే నని మనమ్మున సుంత తలంపఁబోక శా
పమ్మిడె నాకు నీమగఁడు, భర్త మనం బిఁక నెట్లుమార్చి పు
ణ్యమ్మును గట్టికొందువో కదా!”యని నాఁడె కుబేరుభార్య పా
దమ్ములు పట్టుకొన్న శ్రమతప్పెడుఁగాని స్ఫురింప దత్తరిన్.

కోమలి మానసంబు సుమకోమలమే సుమ; స్వచ్ఛమైన సత్
ప్రేమ మహాత్మ్యముం బొలఁతిరీతిగఁ బూనుచుఁ జేమెలుంగు నా
స్వామినిఁ గావుమంచుఁ బలుసారులు వేఁడుటకంటె, వాని భా
మామణి నించుకంత బతిమాలియెయున్న వెతల్ ఘటిల్లునే?

కొలువునువీడి వచ్చుటలోన కొంత విలంబన మయ్యెనేని చూ
పులునిగిడించి, తెప్పలనుమూయక నాకయి చూచుచుండఁగ
న్గొలఁకుల బాష్పబిందువులఁ గోటనుజిమ్ముచు నా లతాంగి, యె
ట్టులనివు డోర్చుచున్నదో కదుంగడు దీర్ఘవియోగదీపికల్! ౨౦

"వెడలుచునుంటి నే ననుభవింపఁగ శాపఫలంబు తల్లి ! నీ
కొమకునకున్ శుభంబు లొనఁగూడఁగ దీవనలిమ్ము" టంచు నే
నడుగులపైని వ్రాల, "తనయా! కనుపారఁగఁ గాంచినట్టి నా
యెడఁదను గత్తికోఁత నిడదే?" యని యేడ్చెను తల్లి గొల్లునన్.

ధీరోదాత్తుఁడు తాన నాజనకుఁ డుత్కంపించు ప్రేమమ్ముతో
నోరారంగ, "సుఖావహమా"! యనుచు నేమన్ మ్రొక్క దీవించి "వే
రారా! శాపసమాప్తినొంది సుకుమారా!" యంచు వీడ్కొల్పె; నా
కారుణ్యాత్ముని పల్కులెన్నడు వృథాకాఁబోవు ముమ్మాటికిన్.

వేఁగెద కానన స్థలికి; నేనొక యేఁడగుదాఁక క్రమ్మఱన్
రాఁగలవాఁడఁ గా; నిఁక సరాగము మీఱఁగ ధీరచిత్తవై
సాఁగఁగనంపు మన్ననుచు సాధ్విని గోరఁగ, నన్ దటాలునన్
గౌఁగిటఁజేర్చి, యెంతవిడనాడు మటన్నను వీడఁ గల్గెనే? ౨౩

చానను బల్మిమై విడిచి శాపఫలంబును బొంద నక్కటా!
కానన సీమ కే నరుగు కాలమునందుఁ దదేక దీక్షతో
మేను గవాటబంధమున మెల్లనఁజేర్చి లతాంగి నాదెసన్
గానఁదొడంగె, నేనుఁ దనకంటికిఁ గన్పడుదాఁక నచ్చొటన్ ౨౪

దవ్వగుచుంటి నన్న పరితాపము దుర్భరమౌట, నిస్పృహం
గెవ్వున కేకవైచి తన కేలుగవం గనుఁదోయిఁ గప్పి తా
నవ్వల మోముగాఁ దిరిగె, నక్కట! ప్రేయసి కేక నాచెవిన్
రివ్వున మ్రోగుచున్నది; భరింపఁ దరంబె తదీయ నాదమున్?

ఇంతిని వీడి పోవుతఱి నే కడసారి తదేక దృష్టితోఁ
గాంత మనోహరాకృతినిఁ గాంచుటచే నల దివ్యవిగ్రహం
బంతయు నచ్చుగ్రుద్దినటు హత్తుకొనెన్ హృదయాంతరాళమం
దెంత ప్రగాఢ మైనదొ సుమీ, మమకారము ప్రాణికోటికిన్ !

నేరమును నే నొనర్చిన కారణమున
శిక్ష నాకు విధింపఁగాఁ జెల్లుఁగాని
నన్ను నుగ్రాటవులపాలొనర్చి, నాకు
భార్యకు వియోగ దుఃఖంబుఁ బఱపఁదగునె ? ౨౮

నాసతి దుఃఖితం గని మనంబు వఁగుచుంట కంటె "నాత్మజున్
దోసము సైఁపు"మంచు ధనదుం గని నాజనకుండు వేఁడుచో
నీసును మాని శాపమతఁ డించుక త్రిప్పఁగ వచ్చుఁగాని, వి
శ్వాస విహీన మానసులఁ బ్రార్థనజేయఁడు తండ్రియెన్నఁడున్.
తప్పొనరించి నందులకు దండన సేయుటొ? కొల్వునుండి న
న్నప్పుడె తీసివైచుటొ ? ధనాధిపు ధర్మము కాని న్యాయమున్
దప్పి ధనేశ్వరుం డనెడు దర్పము చేతను హద్దుమీఱి న
న్నిప్పగిదిన్ శపింపఁ దన కింతధికార మెవం డొసంగెనో! ౨౯

జీతము కోస మే నతని సేవలఁ జేసితిఁ గాని వాని కే
రీతిని నాశరీరము ఖరీదున కమ్ముకొనంగ లేదె దు
ర్నీతిని బానిసీఁడుగ? గణింపఁగ నక్రమమైన శాప మి
బ్భాతినొసంగ నెట్లతఁడు పాల్పడెనో కద చిత్రమయ్యెడిన్ ! 30

"సేవల కేవిధాన మునుచేసిన వారలు లే" రటంచు నె
న్నో విధముల్ సదా పొగడుచుండు కుబేరుఁడె నన్ను నన్యథా
భావన చేసి నోటి కెటువచ్చిన నట్టులు దూలనాడె; నే
నా విధులందు లోపములు వచ్చిన నైఁపరె, యుత్తమప్రభుల్?

అరముడి దైవదత్తమగు హక్కనుచున్ నిఖిలాధికారముల్
నెరపి నిరంకుశత్వమున నిట్టుల నేలు కుబేరుఁడౌర! నా
కరు నగు నన్ను దాసినిగా గణియించి పరాభవించె, నీ
తర తమ భావ మెన్నఁడు యథార్థముగా నశియించిపోవునో!

శాప మొసంగు మేటి మునిసత్తములున్, బ్రథమాపరాధమున్
సైఁపఁగ భక్తి వేఁడుకొను సాధు జనాళిని దోసి పుచ్చుకే
శాపము క్రిమ్మరింతు రను సంగతి మున్ ధనదుం డెఱింగి, యే
పాపము లేని నాపయిఁ గృపన్ వహియింపఁడ దేమి కోపమో!

కోపము చేఁ గుబేరుఁ డిది కూడునొ కూడదొ యెంచ కే
శాప మొసంగెఁగాక! దివిషద్వరులెల్ల రెఱింగి కూడ నీ
కీపని కూడదంచు నొకఁడేనియు నాతనితోడఁ బోరి నా
యాపదఁ బాపెనో కటా! దివియందున ధర్మము మాసిపోయెనే?

సతి నెడఁబాయఁ జాలక యె సామెయిఁ బార్వతిఁ గన్ వహించి, సం
తత సుఖలీలలం దనరు దైవము వయ్యు, ధనేశ్వరుండు మ
త్పతి నెడఁ బాయ శాపము నొసంగిన తోడనె చక్కఁ జేయకే
యితరుల మాడ్కి మానము వహించితి వేటికి? చండికేశ్వరా!

నిరుపమ సాధుశీలుర ననేక విధమ్ముల బాధపెట్టఁగా
దారుణమౌను పేటిన్యాయమొకొ! తోయజనాభ! సత్ప్రియుండవున్
బరమ దయామయుండ వని ప్రస్తుతి కెక్కిన నీవె యీగతిన్
జరువుచు నుండఁగాఁ బరులు సల్పుటలో విపరీత ముండునే?

సీతను రావణుం డెడము సేయఁగ, స్వీయ సతీ వియోగ దుః
ఖాతి శయాన పెక్కు నెలలందిన స్వానుభవుండ వయ్యు, మ
న్నాతిని బాసి ఘోరవిపినంబున శోషిలుచున్న నన్ను నీ
రీతిని నిర్దయామతివి శ్రీరఘురామ! కనంగఁ బాడియే? ౩౭

పరమాత్ముం బరిపూర్ణ భక్తిని సదా ప్రార్థించు నా భక్తశే
ఖరునే వేయివిధాలఁ గష్టముల పాల్గావించి శోధించుచున్
బరిపాలించుటె దేవదేవుని స్వభావంబయ్యె, నా "దేవుడై,
గురుడై" యుంచుఁ జరించు నాస్తికుల కెగ్గుల్ గూర్పఁ డొక్కప్పుడున్

అక్రమమైన శాపము ధనాధిపుఁ డిచ్చెఁ గాని, యద్ది ని
ర్వక్రగతిన్ ఫలించుటనుబట్టి యథార్థము నెంచి చూడఁగాఁ
జక్రధరుండుఁ గూడ ననిశమ్ము ధనేశుల పక్షపాతియై
వక్రమతిన్ బ్రపంచ పరిపాలన చేసెడి నంచుఁ దోఁచెడున్.

అనుదిన మా పరేశుని సమర్చన చేసెడు వేళ లందునన్
మనసున నన్ను నిల్పి, పరమాత్ముని తోడ సమానరీతిగా
ననుఁ దన నెమ్మనమ్మున ఘనమ్ముగఁ గొల్చుచునున్న పుణ్యసా
ధ్విని విడనాడు నంతటి యదృష్టవిహీనుఁడు వేఱొకల్గునే? ౪౦

నా కమలాయతాక్షికిని నాకు వియోగము నెట్లొనర్చెనో
యాకరణిం గుబేరునకు నాతని భార్య కజుం డొనర్చుచో,
వాకొనరాని నాదు దురవస్థ రవంత గ్రహింపఁ గల్గు; తన్
దాఁకఁగ వచ్చినప్పుడె కదా, తగవుల్ తెగు నెంతవానికిన్ ?

"పెట్టితివీవె నాకు సతిభిక్షను నయ్యది రట్టుసేయ నీ
కెట్టులు బుద్ధిపుట్టె; నగరే, పరివారన, నన్నుఁగట్టిగాఁ
దిట్టుచు నెట్టకేలకు, సతీపతులన్ విడఁగొట్టు పాప మె
క్పుట్టునసైన నాధనదుఁ బట్టి వినాశమొనర్పకుండునే ? ౪౨

ముత్తత కన్నుఁ గప్ప దయచూలి కుబేరుఁడు నాలతాంగితో
బొత్తెడఁ బాపి నన్ను వనభూమిఁ గృశింప శపించుకంటె,బల్
కత్తినిఁ జేతఁ బూని, యనుకంపను మాని, కటుక్కుమంచు నా
కుత్తుక నుత్తరించి తన కోపముఁ బాపుకొనంగ రాదొకో! ౪౩

స్వర్గమందు నాదర్శ దంపతులవోలెఁ
బ్రేమ తళుకొత్త మేము జీవించు టరసి,
యోర్వలేక ధనేశుఁ డేదో నెపమున
వేరుచేసెను తన కసిఁదీర మమ్ము. ౪౪

కాయములు రెండె యైనను గాని, యాత్మ
లొకటె నాకును నాసతి కకట! మాదు
కాయములు వేరుసేయఁగాఁ గలిగెఁ గాని
యాత్మలెడబాప ధనదున కలవి యగునె ? ౪౫

చందురునుండి చంద్రికను, సంపెఁగనుండి పరీమళంబు, నే
చందమున వేరు సేయఁగ నసాధ్యము! యాగతి "నిన్ను నన్ను నీ
బొందెలలోన జీవములఁ బూనిన యంతకు వేరుగా శతా
నందుఁడు సేయలేఁ" డనుచు నాసతి పల్కిన దెంత బేలయో!

సంతతిఁ గల్గి యున్నయెడ సాఁకు బిడ్డలఁ జూచుకొంచు, ని
శ్చింతగ రోజులం గడపఁ జేసెకు సాధ్యముకాని, యింట నే
కాంతముగా వసించుచును, గాలము బుచ్చుటెకష్టమాటచేఁ
జింతిలుకంటె మోదమెటు చెందఁగ సాధ్య మొకప్పు డేనియున్?

నీడ విధాన నేను గృహిణీ సముఖమ్మున నున్నవేళలన్
వేఁడి వెలుంగుఁ గన్గొనిన నీరజమట్లు వికాసమందుఁ బూ
బోఁడి మొగంబు, నే నవలఁబోవ, నిశీధిని వారిజంబటుల్
వాడఁ దొడంగు నాపెముఖపద్మము; నాపయి నెంత ప్రేమయో!

కటకట! యెంత దుర్విధియొ కాక సతిన్ విడనాడనౌనె? యా
కుటిల కటాక్ష వీక్షణలు, కోమల రమ్య కపోలకాంతు, లా
చటుల విభాసిత భ్రుకుటి చాలనవైఖరిఁ, గాంచు భాగ్య మె
న్నటికి లభించు నోకద మనం బలరారఁగ మాటిమాటికిన్?

అందములోన నాచెలియ కా చెలి సాటి; లతాంగులందుఁ గ
న్గొంద మటన్న నాపె కొనగోటి కొకర్తెయు నీడురాదు, స్త్రీ
సుందర రూప మీ జగతిఁ జూపఁగ మచ్చునకున్ విరించి యా
చందమునన్ సృజించినటు చూనవెలుఁగు మనోహరాకృతిన్.

నీల నీరదము గాన్పించి నంత నెలంత
వేణీభరంబు జ్ఞప్తికిని వచ్చుఁ;
బూర్ణ సుధాంశుఁడు పొడ సూపి నప్పుడు
కలికి చక్కని మోము కంటఁగట్టు;
వనరుహంబులు నీటిపైఁ దేలియాడఁగ
కోమలి కందోయి గోచరించు;
జక్కవ పిట్టల జంట కంటను బడ
వెలఁది వక్షోజముల్ స్పృహకువచ్చుఁ;

బ్రకృతి నే రమ్య తమ పదార్థమును గనిన
సుదతి యవయవంబు విధాన మదికిఁ దోఁచు
నెంత మఱపును బూని చరింతు నన్నఁ
గాంత రూపంబె యెపుడు సాక్షాత్కరించు. ౨౧

నట చెనా, పండు పున్నమ చందమామల
కాంతిపుంజము దిశల్ క్రమ్ముకొనును;
యాలోకన మొనర్చెనా, వేయి మదన సా
యకము లిమ్మెయి నాటి నట్టులగును;
నాట్యంబు నొనరించెనా, లక్ష శారదల్
నృత్యం బొనర్చిన రీతిఁ దోఁచు;
యాలాపన మొనర్చెనా, కోటి కిన్నెర
లొకసారి మీటిన ట్లోలయుచుండు;

హాస మొనరించెనా చెక్కు కందరాని
మల్లెమొగ్గలు విచ్చిన మాడ్కి మెరయు;
నావిశాలాక్షి రూపరేఖావిలాస
ములను వర్ణింప నలువకు నలవికాదు. గీ.

చక్కెరబొమ్మ చందమున జాన తయారయి పవ్వళింప నే
పక్కను జేరి సంగటనె వచ్చి ముదంబున నా పదంబులన్
జక్కఁగ నొత్తుచున్ మరులెసంగఁ బ్రసంగ మొనర్చి ప్రేమ త
త్త్వోత్తఁ జరించు రోజు లౌనఁ గూడునొ కూడదొ యింక మీఁదటన్

అర నిముసంబు తీఱిక గు నంతనె భార్యను బిల్చి తృప్తిచే
కుర దనమోవి తేనియల గ్రోలుచు వేమరు కౌఁగిలించుచున్
బరవశ మొందఁగా వివిధభంగుల సౌఖ్యరసాబ్ధి వీచికాం
తరముల నోలలార్చితిని, దద్విభవ మొక్కటు భాగ్యమబ్బునే? గిర

పున్నమ నాఁటి రేలఁ బరిపూర్ణ ముదమ్మునఁ బూలతోఁటలో
నున్నత రమ్య హర్మ్యమున నుంచి లతాంగిని మోహవార్ధి న
న్నన్ని విధాలఁ దేల్చి సుఖ మొంపఁగఁ జేసితి; నిప్పుడా శశిన్
గన్నపుడెల్ల నాచెలియ కాంచెడు వంతకు నంత ముఁడునే?

“ఎప్పుడు పూర్ణచంద్రుఁ డుదయించునొ? యెప్పుడు నిండువెన్నెలం
దొప్పులకుప్పఁ గూడి ముద మొందెదనో?” యని వేచియుండు నా
కిప్పుడు పండువెన్నెల దహించుచు నుండిన మండుటేసవిన్
నిప్పులు గుప్పుచున్నటులు నెమ్మదికిం గనుపట్టుచుండెడిన్ గి॥

ఊరు సుఖజీవనం బమరి యుండిన నన్నిటు ఘోరకాననాం
తరముల కంపుటిల్ గన, ఘనమ్ముగ వెల్గెడి వెల్గునుండి దు
ర్భర తమసమ్ముఁ జేర్చిన విధమ్మున, స్వర్గమునుండి బల్మిమై
నరకములోనఁ ద్రోసినటు నాకనిపించు నిదేమి వోద్యమా !

తత హంసతూలికా తల్పంబు పోనాడి
        బండరాలనుఁ బండ వలసివచ్చెఁ;
పంచభక్ష్య రుచిర పరమాన్నములు మాని
        వాయు భక్షణ సేయవలసివచ్చెఁ;
మృదుతర రమ్య పట్టుదుకూలములు వీడి
        పాఁతగుడ్డలు కట్ట వలసివచ్చెఁ;
మహనీయ భర్త హర్మ్యమ్ములు విడనాడి
        వనవాటి నివసింప వలసివచ్చెఁ;
    దాసదాసీ జనమ్ములఁ బాసి, ఘోర
    వన్యమృగములతో నుండ వలసివచ్చెఁ;
    పూర్వభవ పాపఫలమిట్లు పొందవలసె;
    విధి విధానంబు నెవరు తప్పింపఁ గలరు ? గీ॥

ప్రేయసి దివ్యమంగళ సువిగ్రహరాజము నా శరీరమున్
గోముగ వచ్చు రక్తమున గోట్లకొలందిగ నెండుటాకులన్
వ్రాయుచు వచ్చుచుండిన రవంతయుఁ దృప్తి జనింపదాయె;నా
కాయెలనాగ మోముఁ గనులారఁగఁ గనుంగొను భాగ్యమెన్నఁడో?

వ్రాసిన మూర్తులెల్ల నలుఁబ్రక్కలఁజేర్చితి నెందుఁబోయినన్
నాసతి ముగ్ధమోము నయనమ్ములకుం గనుపించు నన్న యు
య్యాసను జేసి, వర్ష మకటా! చెలి రూపును మాపివైచి నా
యాస నిరాశ జేసెఁ; బరమాత్మునకుం బగవాఁడనైతి నే? ౭౦

జ్ఞానము గల్గినట్టి నిముసంబున నుండి యథోచితంబుగా
దానము ధర్మముల్ పలువిధమ్ము లొనర్చితిఁగాని, యేరికిన్
హాని యొనర్చి నే నెఱుఁగ నక్కట! యేలొకొ నన్ను నీగతిన్
గానల పాలొనర్చి కడగండ్లను గూర్చితి వయ్య దయ్యమా!

తను వెపుడెప్పుడైన స్పృహఁదప్పి కనుంగవ మూఁతవడ్డ వెం
టనె, ప్రియురాలు చెంతకుఁ దటాలున వచ్చి, విషాదపూరితా
ననయు, "హా మనోహరుఁడ! నావలనం గద యింత వచ్చె నీ"
కని వగపోయుచుం బలుకు నట్టిదనుంగని జాలిచూపులన్ ౭౧

కలలోనన్ హృదయేశ్వరీ ప్రతిమ నేఁ గన్నార వీక్షించి, సం
చలచిత్తంబున నాపె యంస యుగమున్ హస్తద్వయిం బట్టి బా
హులతావేష్టన మాచరించునటులై యొప్పారుటం జేసి, క
న్నుల నొక్కించుక విప్పి సిగ్గిలితి భ్రమానుంగాంచి నా కౌఁగిటన్.

మంచముఁబట్టి తిండియను మాట యెఱుంగక, చిక్కి శల్యమై
పంచశరాగ్నికీలలకు భస్మముగా గుఱియైన యట్లు కా
న్పించెను స్వప్నమందు చెలి నిన్నటిరాతిరి, నింక నాపె జీ
వించునొ లేదొ! నాహృదయవేదన తీర్చెడు వారలెవ్వరో!

ఇంతటి ఘోరకృత్యమున కెవ్వఁడుఁ బాల్పడఁబోఁడు, నేను శా
పాంతము కాఁగ వచ్చిన నటంచుఁ బ్రమాణముచేసి పల్కుటన్
జింతను మాని నా కొఱకుఁ జేసను పాణిముఁబట్టి, ధీరతా
స్వాంతముతోడ జీవితము సల్పుచు సందియమంద నేటికిన్ ?

"ఏటికి నీమనోహరున కింతటి శాపము సంఘటిల్లె నో
బోటి! వచింపఁగావలయు బూసను గ్రుచ్చిన మాడ్కి మాకు మో
మాటము మాని నీ వనుచు ముద్దియ లామెనుగోర, నట్లు బా
హాటముగా వచింపఁ గల దక్కట! కారణమున్న రీతిగా? ౬౬

కారణముఁ జెప్పఁబో విన్నవార లార !
కాముకుల కెల్లఁ దగినట్లె కఠిన శాప
మిచ్చె నా కుబేరుఁ డటంచు నెంచుకొనరె ?
యెంత తలవంపు ఘటియించె నీశ్వరుండు ? ౬౭

ఈశునిఁ గూర్చి యెందఱో మునీశులు ఘోర తపం బొనర్చి స
ర్వేశు కృపాకటాక్షమున నెన్నియొ కామములఁ బాసిరన్న య
య్యాశను జేసి వారివలె ధ్యాన మొనర్చితిఁ గాని, మోహ సం
పాశ విబద్ధ సంచలిత భావుఁడ నౌట, ఫలింప దయ్యెడిన్ ౬౮

స్థిరమతి లేక మోహజలధింబడి యిట్టటుఁ గొట్టుకొంచు నీ
వఱకు నమూల్యకాలమును వ్యర్థ మొనర్చితిఁ గాని, యాపరా
త్పరుని పదారవిందములె ధ్యాన మొనర్చుచు నిశ్చలాత్మతోఁ
బఱఁగిన జన్మజన్మముల స్వర్గసుఖం బొనఁగూడ కుండునే? ౬౯

ఉల్లసమారఁగా లతల నుయ్యెల లూఁగుచు హాయి మీఱఁగాఁ
జల్లని పిల్లతెమ్మెరల చాటున పారెకుఁ గ్రీడలాడి, రం
జిల్లెడు పక్షి దంపతుల నిత్యసుఖ మ్మేఁ గనుఁగొంచు నక్కటా!
యుల్లము నందు నెట్లు మరపొందఁ దరంబగు నాతలోదరిన్ ?

పక్షిసంతతి కున్నంత వఱకునైన
స్వేచ్ఛ లేదయ్యె మామక జీవితమున
కకట! యిటువంటి పాడు పుట్టుకను బుట్టి
బ్రతుకు కంటె చచ్చుటె మేలు బల్మిమీఱ. ౭౧

సరసిని హంస దంపతులు పారెకు ముక్కులు వెట్టుచుండ నే
నరసిన వేళలందుఁ బ్రియమారఁ డటాకములోన, నేను నా
తరుణినిఁగూడి యాడుచు ముదంబునుబొందినయట్టి కృత్యముల్
స్మరణకు వచ్చి నెమ్మనము సంచలితమ్ముసరించు చుండెడిన్.

మల్లె గులాబి సంపెఁగ సుమంబుల నుండి మనోహరంబుగాఁ
జల్లెడు సౌరభం బెదఁ బ్రశాంతినిఁ గూర్పఁగఁ బూలతోఁటలో
సల్లలితానురాగమునఁ జానయు నేనుఁ జరించి మించి, రం
జిల్లెడు నాళు లెంచుచుఁ గృశింపఁ దొడంగితి నాఁటి నాఁటికిన్.

ఘనసుంద రోద్యాస వనమునఁ దనరారు
పూవుఁ దీవెలు వాడిపోయె నేమొ!
పల్కు పల్కనఁ దేనెలొల్కఁ గుల్కుచుఁ బల్కు
చిల్కదంపతులు కృశించె నేమొ!
యారోహణ మొనర్చి నంత రివ్వనఁ బాఱు
వారువంబులు వసివాడె నేమొ!
కోరిన దుగ్ధముల్ కుంభవృష్టిగఁ గురి
యించు గోమాత క్షీణించె నేమొ!

యగ్గులకు మగ్గులొత్తు చెల్లపుడు సేవ
చేయు దాసీజనము వాసిపోయె నేమొ!
తెలియరాదయ్యె; నిట నిజస్థితి వచించు
వారలుందురె? నా వెఱ్ఱి భ్రాంతిగాక! ౭౪

కోయిల గున్నమావి కొనకొమ్మ వసించి, చిగుళ్ళు మేయుచున్
హాయిమెయిన్గుహూకుహూయటంచునుగూయుచు నాడుజీవము
ల్దీయుచు నుండు; నెంత యదలించినఁగాని మదించి కొమ్మలన్
బాయదు; మామకాజ్ఞ యనఁ బత్తికిసైతముఁజుల్కనయ్యెఁగా?

ఈపరితాప భారము నొకించుక యేని భరింపలేక నా
కోపము దీర కోలఁగొని కోయిల ప్రాణము దీయఁ బూనియున్
బాప మటంచు మానితిని, బల్మిమెయిం దన పెంటికూడ సం
తాపముచే మృతింగనినఁ దత్ఫలితంబును బొందనోఁగదా? ౭౫

కాముఁడు క్రూరుఁడన్న నుడికార మబద్ధము కాదు; నిచ్చలున్
బ్రేమరసైక మానసులఁ బెట్టెడు బాధలఁ గాంచి సత్కృపా
ధాముఁడు శంకరుం డతని దగ్ధమొనర్చియుఁ దత్సతీమణీ
క్షేమము నెంచి యాతని సజీవునిఁ జేయుట ముప్పువాటిలెన్.

రూపము గల్గియున్న కలరూపముగాంచి మనోజుఁడంచు సం-
తాపము కొంతఁ బాపుకొనఁ దావొదవుంగద? వానిరూపమున్
మాపుటచేఁ బురాంతకుఁడు, నా కనులం బడకుండ రేబవల్
తూపులునాటి నాయెడఁదఁ దూట్లు పడంగనొనర్చుచుండెడిన్.

అనితరసాధ్య కష్టనిచయంబు లెసంగెడు కాలమాటచేఁ
గనఁబడుచున్నదెన్నియొ యుగంబుల కైవడి వత్సరంబిటన్
ఘనతర సౌఖ్యసంపదలఁ గాంచెడు కాలమెయైన, వర్షమే
దినమయి తోఁచు; కారణము దీనికి దుర్బలచిత్తమే కదా? ౭౯

ఎంతప్రయత్నమున్ జలిపి యే నిదురింతు నటన్నఁ గంటికో
కింతయుఁ గూర్కుపట్ట, దెదియేనియుఁ దృప్తిగఁ బొట్టనిండ భ-
క్షింతు నటన్న నోటికి రుచింపదు, నీరముఁ గ్రోల లోనికిన్
సుంతయుఁ బోవ, దెట్లునిలుచున్ మెయి జీవములింక మీఁదటన్.

ఎండ కే నెండి వాన కెంతేని తడిసి
చలికి గడగడ వడఁకి నిచ్చలు భరింప
రాని కడగండ్లు పడసితిఁ గాని సుంత
సౌఖ్యమెఱుఁగను గలలోన సైత మకట! ౮౧

పాశములలోన లోప మేపాటియున్న
భోజనము మాని యిలువీడి పోవుదుందు
అన్నపానంబులను గాలిఁ దన్నుకతన
దూరమైతిని తింపి కీర్తిఁగాను. ౧౨

లేచినవేళ యెట్టిదియొ! లేక మహాత్ముని పాదుమోము నేఁ
జూచితినో! దశాధిపతి చూడ స్వభుక్తినిఁ బొందెనో! మతే
నీచులతోడఁ గూడెనొ! గణింపఁగ నద్దశ ఛిద్రమయ్యెనో!
తోఁచుటలేదె యీగతిని దుర్గతిఁ బట్టుట కేమిహేతువో! ౧౩

ఎట్టిముహూర్తమందు ఘటియించిరొ పెండిలిమాకు? తాలిఁ
గట్టిన మూడు నాళులకె కట్ట! వియోగము సంభవించె; నా
కట్టిడి బ్రహ్మ యిట్లు కడగండ్లనుఁ గూడఁగ మానొసళ్ళపై
నెట్టన వ్రాసెనేమొ? విధి నిర్ణయమున్ జవదాఁట శక్యమే?

యోగము బాగులేని తఱి నున్నత పన్నగరాజమైన నే
లాగున చిన్న చీమల బలానికి లోఁబడునో, యటే వెతల్
రాఁగ మహాత్ముఁడైన నవురా, కనునల్పులచేతఁ జిక్కుఁ; గ
ర్మాగత పాపమున్ ఫలిత మందక తప్పునె యెంతవారికిన్? ౧౪

శాప మతిక్రమింపఁగ నశక్తుఁడనౌట వియోగభార చిం
తాపరిపంథి బంధిత మనస్కుఁడనైతిని; లేకయున్న భా
ర్యాపరిరంభణంబు బిగియాఱ నొనర్పఁగ ఱెక్కలూఁది తా
రాపథమందుఁ బాఱుచును వ్రాలనె నాప్రియురాలి చెంగటన్?

బ్రతికిన యంత దాఁక మగవారలు "నాసతి నాకుమారు"లం
చతి మమతన్ మతిం దలఁతు రక్కట! ప్రాణము పోయినంతనే
పతిని సుతాళులం దెలియఁజాలరు; సర్వము మిథ్య కాన, నే
బ్రతుకుటకంటె చచ్చుటె యవశ్యసమాచరణీయ మీ యెడన్.

పాపములలోన నాత్మహత్యాపరాధ
మధిక మంచు వచించెద రఖిల విబుధు,
లధమ జీవితమున వ్యథ లనుభవించు
కంటె నీ పాప మధికంబు కాదు నాకు. ౮౮

బలిమిని ప్రాణముల్ విడువఁబన్నరు నేనిచటం బ్రయత్నముల్
సలిపితిఁగాని పూర్తి విఫలత్వముగల్గెను, దీనిఁజూడ, నా
కులపతిఁ గాను భాగ్యమునఁ గూడ నటన్న తలంపు నెమ్మదిన్
గలుగుచునుండు, నింతకును కర్మఫలంబె యిలున్నవో కదా నా

పవలున్ రేలును పుత్రసంతతికినై పల్మారు చింతించి, మా
ధవు కారుణ్యమునన్ వసుంబడసి, విద్యాబుద్ధులన్ నేర్పి, గా
రవమొప్పారఁగఁ బెంచు నాజనని పుత్రప్రేమయే నిచ్చలున్
గవచంబై నను గాచుచున్న దిక దా కాంతారవాసంబునన్ గం

మొంచి తనాన జీవితము బుద్బుతి నెన్నిది మాసముల్ మహో
ద్దండ భయంకరాటవిని దాతయు దైవము లేక, యక్కటా!
పండిన పొట్లపండువలె వర్ష్మ మిటుల్ క్షణభంగురంబుగా
నుండెడు; ప్రాణమెట్టులిఁక నుండునొ రాఁగల నాల్గుమాసముల్

సర్వజనులు సత్కర్మ దుష్కర్మ ఫలము
లనుభవింపకఁ దప్ప దటంచు సకల
శాస్త్రములు ఘోషిలుచె కాని, సత్య మింత
వఱకుఁ దెలిసిన వార లెవ్వరును లేరు. ౨

గత విశేషంబు లొక్క టొక్కటి మదీయ
భావ వీథిఁ బ్రవేశించి బాధ గదుర
కట్ట తెగిన తటాకోదకంబు కరణి
బాష్పవారి ప్రవాహమై పాఱఁదొడఁగె. ౩

రాత్రియుం బవల్ విశ్రవిరామములేక రథాల కైవడిన్
నాతలలోన భీషణ నినాదపరంపర లుప్పతిల్ల వే
రీతుల నేవొ పర్వుచు, భరింపఁగరాని దురంత వేదనో
ద్ధూత మనస్కఁ జేసి ధృతిఁదూల్చుచునుండు నదేమి హేతువో?
“శాంతముఁబొందుమా! యిటువిచారమునొందఫలంబు లేదు శా
పాంతముకాఁగ నీ వనరుహాక్షినిఁ గూడెదు భాగ్యమబ్బు; నీ
చింతలు కాపురం బెపుడుఁ జేయవు; ధైర్యమవశ్య” మంచు, వే
కాంతులతో వెలుంగు వనకాంత వచించెను నప్పుడప్పుడున్.

మనసును బట్టలేక పలుమాఱు లొనర్చెదు నా యరణ్యరో
దనమును విన్నవారెవరు? ధాత్రియొ! లేక ధరాధరంబొ! జీ
వనదమొ! కాని బంధువులు వత్తురె? యింతకు నా లలాటరే
ఖన మెటులున్నదో, యెటులెకాళ మఱొందు విధంబుకల్గునే?

నవ వధూవియోగ భర దందహ్యమాన
మానసుఁడ నౌట మేను క్రమక్రమమ్ము
చిక్కి శల్యావశిష్టమై స్రుక్కు కతన
స్వర్ణమయ కంకణము చేయి జారి పడియె. ౯౭

చెలియ కే నెట్టు లున్నానొ తెలియకునికి
నెంత వగఁజెందుచుం గృశియించునొ కద?
ధైర్యము వహింపు మని నీరదమ్ము చేత
రాయబారము నంపెద రమణి కడకు. ౯౮

కవితఁ, గానముఁ, జిత్రలేఖన మొకింత
బాల్య మాదిగ నేర్చిన వాఁడ నగుట,
నెలఁత గుణ రూపములను వర్ణించుకొనుచుఁ,
బాడుకొనుచు, లిఖించుచుఁ బ్రతుక వలసె. ౯౯

ఓ వనమాలి! మామక వియోగ భరంబునుదీర్చి, వేగ నా
దేవినిఁగూసి కుల్కెడు యదృష్టముఁగూర్చిన, బాష్పధారలన్
దావక పాదముల్ కడిగి, తారలె పూవులుగాగ మేఘమా
లావృత నిర్మలోదకము లర్ఘ్యముగాఁగ నొనర్చికొల్చెదన్. ౧౦౦



కాకినాడ ముద్రాక్షరశాల కాకినాడ ఇ. జి. 19—500.

## ప్రేమతో విరాళము లొసంగిన ప్రియమిత్రులు

శ్రీ పిల్యాణం రామమూర్తిగారు.

శ్రీ ర్యాలి నాయనగారు.

శ్రీ డొంక కన్నాచారిగారు.

శ్రీ లకోజు కనకరత్నంగారు.

శ్రీ కొల్లేపర సుబ్బారావుగారు.

శ్రీ నాగుమల్లి రాజారావుగారు.

శ్రీ ఆకోజు వరప్రసాదరావుగారు.

శ్రీ లంక నూకరాజుగారు.

శ్రీ వీరమళ్ళ వెంకటరత్నంగారు.

శ్రీ నామగిరి వీరభద్రస్వామిగారు.